**శ్రీమతే రామానుజాయ నమః**



# శ్రీమదణ్ణంగరార్య వైభవనుతిమాలికా



పద్మవిభూషణేత్యాది బహు బిరుదభూషితులు,
ఉభయవేదాంతప్రవర్తాకాగ్రేసరులు, జగదాచార్య సింహాసనాధిపతులు,
**శ్రీమాన్ కాఞ్చీ ప్రతివాదిభయంకరం అణ్ణంగరాచార్య స్వామిపాదులు**

<u>సమర్పణ:</u>

ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గహ శింగరాచార్య దాసుడు

01-ఏప్రిల్-2021

# విజ్ఞప్తి

తమిళనాడులోని కాంచీపురంలో 1891వ సంవత్సరంలో అవతరించి, సుమారు 75 సంవత్సరాలకు పైగా భగవద్రామానుజ సిద్ధాంతానికి, వైదిక సంప్రదాయానికి సేవ చేసిన పద్మవిభూషణ, జగదాచార్యసింహాసనాధిపతి, **కాంచీ మహావిద్వాన్ అణ్ణంగరాచార్య స్వామివారు** అజరామరమైన కీర్తిని గడించారు. వీరిని దర్శించిన వారందరూ పూర్వాచార్యుల అందరి వైభవం వీరిలో దర్శించవచ్చు – అని అనేవారు. యజుర్వేవేదం, దాని వ్యాఖ్యానాలు, ద్రావిడ ప్రబంధాలు, వాటి వ్యాఖ్యానాలు, పూర్వాచార్య స్తోత్రాలు, వాటి వ్యాఖ్యానాలు–వీటిలో వీరికి కల పరిపూర్ణమైన పాండిత్యం వీరు సాటిలేని పండితులు అవడానికి కారణమైనది. ఆళ్వారుల ప్రబంధాలకు, పూర్వాచార్యుల స్తోత్రాలకు ద్రావిడ భాషలో వీరు చాలా గొప్ప వ్యాఖ్యానాలను రచించారు. దివ్యార్థ దీపిక అనే పేరుతో వీరు దివ్యప్రబంధాలకు రచించిన వ్యాఖ్య సాటి లేనిది. పెద్దల అందరి మెప్పును పొందింది. ఆ విధంగానే వీరు 30 సంవత్సరాలకు పైగా ఆంధ్ర, తమిళ, సంస్కృత, హిందీ, ఇంగ్లీష్ భాషలలో మాస పత్రికలను స్వయంగా వ్యాసాలు రచించి నిర్వహించారు. వీరు రచించిన గ్రంథాలు వెయ్యికి పైగా అని తెలుస్తున్నది. నిజానికి ఇది ఒక గిన్నిస్ బుక్ రికార్డు అని చెప్పాలి. తమిళంలో, సంస్కృతంలో మధురమైన కవిత్వాన్ని చెప్పగలిగే సరసకవులు వీరు. ఇటువంటి ఈ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భంలో వీరి పౌత్రులైన శ్రీమాన్ రాజహంసం స్వామివారు, వారి సోదరులు సంప్రదాయంలో ప్రసిద్ధులైన పండితులకు సన్మానం చేస్తున్నారు. ఆ క్రమంలో ఈ సంవత్సరం (01-ఏప్రిల్-2021) దాసుడిని స్వామివారి తిరునక్షత్రోత్సవానికి ఆహ్వానించారు. నిజానికి దాసునకు ఈ పురస్కృతిని గ్రహించే యోగ్యత ఏమీ లేకపోయినా, పెద్దల మాటను కాదనరాదనే భావంతో వెళ్లడం జరిగింది. అప్పుడు శ్రీఅణ్ణంగరాచార్య స్వామివారి విషయంగా వారి వ్యక్తిత్వవైభవాన్ని, గుణ వైభవాన్ని, పాండిత్య వైభవాన్ని కీర్తిస్తూ దాసుడు కొన్ని శ్లోకాలను విన్నపించాడు. అవి ప్రస్తుతం తెలుగు తాత్పర్యంతో సహృదయ పాఠకులకు సమర్పింపబడుతున్నాయి. ఈ ప్రయత్నం కేవలం శ్రీస్వామివారి గుణకీర్తనరూప కైంకర్యంలో భాగమే తప్ప, దాసుని గొప్పతనం ప్రకటించుకునే ప్రయత్నం మాత్రం కాదని మనవి. విజ్ఞులైన పాఠకులు ఇందులోని దోషాలను మన్నిస్తారని భావిస్తాను. ఈ శ్లోకాలలో తగిన సూచనలను చేసిన సుహృన్మణి ఉ.వే. శ్రీమాన్ కందాళ లక్ష్మీనారాయణ స్వామివారికి కృతజ్ఞతాపూర్వక దాసోహాలను సమర్పించుకొంటున్నాను.

భాగవతదాసుడు, ఈ. ఏ. శింగరాచార్యులు,

28-ఏప్రిల్-2021

**శ్రీమతే రామానుజాయ నమః**

# శ్రీమదణ్ణంగరార్య వైభవనుతిమాలికా



**1)** **శ్రీమాన్ దేవాధిరాజో జగతి విజయతే స్వాశ్రితార్థప్రదానే**
**దీక్షాబద్ధ స్స్వమస్తావన సవనవిధిం సర్వథా నిర్వహంశ్చ ।**
**కారుణ్యాత్ యస్య భవ్యాత్ యతికులతరణిం హస్తిగోత్రేశవర్యం**
**ప్రాప్తా కాంచీపురీయం శ్రుతితతిజననీ భారతాఖ్యా చ భూమీ ॥**

కాంచీపురంలో నెలకొని ఉండే వరదరాజ స్వామి భక్తుల కోరికలను అన్నిటిని ఇవ్వడంలో సమర్థుడు. అందరిని రక్షించడమనే యజ్ఞంలో దీక్షను పట్టినవాడు. ఆ స్వామి అనుగ్రహంచేత వేదాలకు పుట్టినిల్లు అయిన భారతదేశం, ఆ విధంగా కాంచీనగరం ఇద్దరు మహనీయులను పొందాయి. వారిలో ఒకరు భగవద్రామానుజులు, రెండవవారు అణ్ణంగరాచార్య స్వామివారు.

2) **హస్త్యద్రినాథ గురుగుణగానం కుర్వే యథాశక్తి ।**
**సత్పురుషకీర్తనాదిహ లభతే సర్వోఽపి జన్మసాఫల్యమ్ ॥**

శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామి వారి సద్గుణాలను కీర్తిస్తాను. మహనీయుల గుణాలను కీర్తించడంవల్ల అందరూ జన్మసాఫల్యాన్ని పొందుతారు కదా.

**3)** **కాంచీనగరీభూషా భూమ్యా ఇతి ఖలు పురాణోక్తిః ।**
**కాంచీనగరీభూషా విలసతి హస్త్యద్రినాథగురువర్యః ॥**

ఈ భూమికి అంతటికీ కాంచీనగరం ఆభరణం అని పురాణాలు చెబుతున్నాయి. ఆ కాంచీనగరానికికూడా ఆభరణం ఎవరంటే–అణ్ణంగరాచార్యస్వామివారే.

4) **భూమ్యాం భూషా భవతి మహతీ భారతాఖ్యాఽవనీయం**
**తస్యాం భూషా భవతి వినుతం చోళరాజ్యం మనోజ్ఞమ్ ।**
**తస్మిన్ భూషా వితతవిభవా భాతి కాంచీ పురీయం**
**తస్యాం భూషా గురుమణిరయం హస్తిగోత్రాధిపార్యః ॥**

ఈ భూమికి అంతటికీ ఆభరణం భారత భూమి. ఆ భారతభూమికి ఆభరణం చోళమండలం. ఆ చోళమండలానికి కాంచీనగరం ఆభరణంగా భాసిస్తున్నది. ఆ కాంచీనగరానికి ఆభరణం అణ్ణంగరాచార్యస్వామివారు.

5) **మన్యే శ్రీవత్సనామ్ని శ్రుతివిదితగుణే విశ్వవిఖ్యాతకీర్తౌ**
**ఆవిర్భూతోఽన్వయే కిం వరవరమునిరాట్ హస్తిగోత్రేశనామ్నా ।**
**యోఽయం కాంచీపురీం స్వైః రుచిరగుణగణైః రత్నజాలోపమేయైః**
**చక్రే దేదీప్యమానాం జితపరమపదాం స్వస్య పూర్త్యా చ కీర్త్యా ॥**

వేద ప్రసిద్ధమైన, లోకంలో పొగడబడే శ్రీవత్సగోత్రంలో మణవాళ మహామునులు అణ్ణంగరాచార్యస్వామి వారి రూపంలో అవతరించారని భావిస్తాను. ఈ స్వామివారి రత్నాల వంటి గొప్ప గుణాల ప్రకాశంచేత, వారి పూర్తిచేత, కీర్తిచేత కాంచీనగరం పరమపదాన్ని మించి గొప్పగా ప్రకాశించింది.

6) **కుశాగ్రబుద్ధ్యా జితగీష్పతిం తం**
**రంగార్యసూనుం సకలాశ్చ విద్యాః ।**
**ప్రపేదిరే సాదరమల్పకాలే**
**వర్షాసు వాహిన్య ఇవాంబురాశిమ్ ॥**
**(గావో యథా నందసుతం సమస్తాః)**

అణ్ణంగరాచార్యస్వామివారి తండ్రిగారి పేరు రంగాచార్యస్వామివారు. పదునైన బుద్ధిని కలిగిన అణ్ణంగరాచార్య స్వామివారు అల్పకాలంలోనే అన్ని విద్యలు నేర్చారు. అది ఏవిధంగా ఉందంటే– వర్షాకాలంలో నదులన్నీ సముద్రంలోకి చేరినట్లు.(రేపల్లెలోని గోవులన్నీ నందకుమారుడైన శ్రీకృష్ణుని దగ్గరకు చేరినట్లున్నది.)

7) **స్వాధ్యాయే పాణినీయే శ్రుతిశిఖరయుగే చాపి కాణాదశాస్త్రే**
**మీమాంసాయాం చ సోఽసావలభత విపులాం పాండితీం నిష్కళంకామ్ ।**

**విద్వాంసోఽముష్య ప్రజ్ఞా మనితరసులభాం ప్రాప్య మోదాతిరేకం**
**శంకంతే స్యాదయం కిం విబుధకులగురుః కిం పునశ్చాదిశేషః ||**

అణ్ణంగరాచార్యస్వామివారు స్వాధ్యాయం అయిన యజుర్వేదాన్ని, వ్యాకరణశాస్త్రాన్ని, న్యాయశాస్త్రాన్ని, మీమాంసను ఉభయ వేదాంతాలను అభ్యసించి వాటిలో పరిపూర్ణమైన, ఏ దోషం లేని పాండిత్యాన్ని సంపాదించారు. వారి ఆ పాండిత్యాన్ని చూచి పెద్దలంతా వీరు సాక్షాత్తు దేవతల గురువైన బృహస్పతియా! ఆదిశేషుడా! అని అందరూ పెద్దలందరూ ఆనందాన్ని, సందేహాన్ని పొందారు.

8) **వేదానుసంధానపరో యదాయం**
**రథ్యాసు కాంచ్యా సహ వేదవిద్భిః |**
**అదృశ్యతాత్యద్భుతసూరిగోష్ఠీ**
**వైకుంఠపుర్యామివ యా హి దివ్యా ||**

క్రమాంతం వేదాన్ని అధ్యయనం చేసిన స్వామివారు వేదపారాయణగోష్ఠితో కలసి కాంచీ నగరంలో వరదరాజస్వామి సన్నిధి నాలుగు వీధులలో ప్రదక్షిణం చేస్తూ, వేదాన్ని అనుసంధించినప్పుడు సాక్షాత్తు పరమపదంలో నిత్యసూరులు పరమపదనాథుని వేదవాక్యాలతో కీర్తించే సన్నివేశం కంటిముందు నిలిచింది.

9) **పీయూషం హ్యధరీకృతం మధురసః ప్రాప్తశ్చ భంగం తథా**
**ద్రాక్షా నీరసతాం గతా చ పయసో గర్వశ్చ ఖర్వోఽభవత్ |**
**సారోఽపీక్షురసస్య వీతవిభవశ్చాసీత్ వచస్సంతతేః**
**మాధుర్యాత్ సమయోచితాద్భుత వచోవారాంనిధేః సద్గురోః ||**

అణ్ణంగరాచార్య స్వామివారు చక్కగా, మధురంగా, సమయస్ఫూర్తితో మాట్లాడగలిగినవారు. వారి మాటల తీయదనంముందు అమృతం రుచి తక్కువ అయినది. తేనె అవమానాన్ని పొందింది. ద్రాక్షరసం నీరసం అయినది. పాల మాధుర్యానికి కల గర్వం భంగమైనది. చెరకురసానికి ఉండే వైభవం అంతా పోయింది.

10) **సితైరూర్ధ్వైః పుండ్రైః సురుచిరతనుం స్మేరవదనం**
**సుధాసారాకల్పైః శ్రుతియుగరహస్యార్థవిషయైః |**
**వచోభిః గర్జంతం స్తనితసదృశైః దేశికవరం**
**ముదా హస్త్యద్రీశార్యమిహ సతతం స్వాంత! కలయ ||**

తెల్లని, అందమైన ఊర్ధ్వపుండ్రాలతో ప్రకాశిస్తున్నది, చిరునవ్వుతో కూడిన ముఖాన్ని కలిగినది అయిన రూపాన్ని కలవారు, అమృత ప్రవాహాన్ని తలపించేవి, ఉభయ వేదాంతాలలోని అర్థాలను కలిగినవి అయిన సూక్తులను మేఘం గర్జించినట్లుగా ప్రవచించేవారైన అణ్ణంగరాచార్యస్వామివారి రూపాన్ని, ఓ మనసా! నీవు సదా మనసులో ఆనందంతో భావించు.

**11) ఆస్యే చక్రతి తేజసా హి మహతా కంఠే చ శంఖాయతే**
**కారుణ్యేన గదాయతే గురురయం శార్ఙ్గాయతే వాక్ శరైః ।**
**సత్తర్కైరిహ నందకాయతి పరైః వాదాహవే సంతతం**
**ప్రేంధే పంచవిధాయుధాత్మకతయా హస్త్యద్రినాథో గురుః ॥**

శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామి ముఖం సుదర్శన చక్రంవలె గొప్ప కాంతితో వెలుగుతున్నది. వారి కంఠం శంఖంవలె అందంగా ఉన్నది, గంభీరంగా ధ్వనిస్తున్నది. ఆళ్వార్లు దయను "అరుళెన్నుమ్ తణ్డాల్" అనే విధంగా గదతో పోల్చారు. ఆ విధంగా దయా గుణంలో స్వామివారు గదవలె ఉన్నారు. పదునైన మాటలను ప్రయోగించడంలో సమర్థులైన శ్రీ స్వామివారు శార్ ఙ్గమనే భగవంతుని వింటివలె ఉన్నారు. చక్కని న్యాయాలను ఇతరులతో వాదించేటప్పుడు ప్రయోగించడంలో సమర్థులైన వీరు నందకఖడ్గం వలె ఉన్నారు. అందువల్ల శ్రీస్వామివారిని గమనిస్తే వారు భగవంతుని అయిదు విధాల ఆయుధాంశాలను కలిగి ఉన్నారని తోస్తుంది.

**12) పాంచజన్యసమో ధ్వానే పరభేదే సుదర్శనః ।**
**శ్రీమాన్ అణ్ణంగరార్యోఽయం శ్రీశతత్త్వ నిరూపకః ॥**

అణ్ణంగరాచార్యస్వామివారు మాట్లాడడంలో పాంచజన్యంవలె గంభీరంగా ఉంటారు. ఇతరుల వాదాలను ఖండించడంలో సుదర్శనంవలె ఉంటారు. శంఖం, చక్రం అనేవి భగవంతుని పరత్వాన్ని సూచించే చిహ్నాలు. శ్రీమాన్ స్వామి వారు కూడా భగవంతుని తత్త్వాన్ని నిరూపించగలవారు అందువల్ల స్వామివారు సుదర్శనం, పాంచజన్యంవలె ఉన్నారు.

**13) శ్రీరామానుజపత్రికా విజయతే యాంఽధ్ర్యాం తథా ద్రావిడే**
**హిందీసంస్కృతహూణగీర్షు చ సతాం ప్రీత్యై ప్రకాశం గతా ।**

**యస్యాః వైదిక సంస్కృతిః యతిపతేః సద్దర్శనం చోద్ధృతం**
**దివ్యార్థా అపి దివ్యసూరివచసాం వ్యాప్తిం గతాః శాశ్వతీమ్ ||**

శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామివారు 'శ్రీరామానుజపత్రిక' అనే పేరుతో తెలుగులో, 'వైదిక మనోహర' అనే పేరుతో సంస్కృతంలో, హిందీలో, 'రామానుజన్' అనే పేరుతో ద్రావిడంలో మాస పత్రికలను సుమారు 30 సంవత్సరాలకు పైగా నడిపి సంప్రదాయ ప్రచారాన్ని నిర్వహించారు. ఈ పత్రికద్వారా సనాతన ధర్మం, భగవద్రామానుజ సిద్ధాంతం ప్రచారం చేయబడ్డాయి.

**14)** **దత్తం పద్మవిభూషణేతి బిరుదం కేంద్రప్రభుత్వేన యత్**
**తత్త్వేతస్య హి ధౌతమంగళయశోహర్మ్యే పతాకా గురోః |**
**సంత్యన్యాని బహూని సార్థకపదాన్యణ్ణంగరార్యస్య యా–**
**న్యేధంతే సముపేత్య తం గుణనిధిం విద్వద్వగతంసాయితమ్ ||**

అణ్ణంగరాచార్యస్వామివారు చేసిన సంప్రదాయ ప్రచారాన్ని, సనాతన ధర్మ సేవను చూచి కేంద్ర ప్రభుత్వంవారు వారిని పద్మవిభూషణ బిరుదంతో సత్కరించారు. ఈ బిరుదం వారి కీర్తిసౌధానికి అందాన్ని కలిగించే గొప్ప పతాక. ఈ విధంగానే జగదాచార్య సింహాసనాధిపతి, మహామహిమోపాధ్యాయ మొదలైన ఎన్నో బిరుదులు వీరిని వరించాయి. గొప్ప పండితులైన వీరిని పొంది అవి సార్థకమయ్యాయి.

**15)** **వ్యాఖ్యా దివ్యకవీంద్రభవ్యవచసాం దివ్యార్థదీపాభిధా**
**హస్త్యద్రీశగురోః ముఖారవిందగళితా పీయూషధారోపమా |**
**హృద్యాం తాం మనసా విభావ్య. విబుధాః యాంతి ప్రమోదం పరం**
**శ్రుత్వా విందతి హర్షజాంశ్చ పులకాన్ శ్రీశోఽపి ధూన్వన్ శిరః ||**

అణ్ణంగరాచార్యస్వామివారు దివ్యసూరుల ప్రబంధాలకు అన్నిటికీ దివ్యార్థ దీపిక అనే ద్రావిడ వ్యాఖ్యానాన్ని చాలా అందంగా రచించారు. ఈ వ్యాఖ్యానంలో ఉండే మంచి మంచి అర్థాలను విని పండితులందరూ చాలా సంతోషిస్తారు. సాక్షాత్తు భగవంతుడు కూడా ఈ అర్థాలను ఆలకించి ఆనందంతో తల ఊగిస్తాడు.

**16)** **అహో భాగ్యమిదం లబ్ధం దాసేన యన్మయా మహత్ |**
**సూక్తేరణ్ణంగరార్యస్య మాధుర్యం చర్వణాత్మకమ్ ||**

శ్రీమాన్ స్వామివారి సూక్తులలోని మాధుర్యాన్ని చవిచూడగలిగిన దాసుని భాగ్యం చాలా గొప్పది.

**17) ధన్యోఽస్మి కృతజ్ఞోఽస్మి ప్రాప్తోఽస్మి ప్రాప్య సర్వస్వం ।**
**అణ్ణంగరార్యసంస్మృతిబహూకృతిరిహాఽత్ర యన్మయా ప్రాప్తా ॥**

అణ్ణంగరాచార్యస్వామివారి స్మారకపురస్కారాన్ని పొందిన దాసుడు నిజంగా ధన్యుడు, కృతజ్ఞుడు, పొందదగిన ప్రాప్యాన్ని పొందినవాడయ్యాడు.

**18) సఖ్యం తదిద్వదితం విభాతి జగతి శ్రీరామ సుగ్రీవయోః**
**మైత్రీ కృష్ణకుచేలయోరపి పురాణోక్తా ప్రసిద్ధా తథా,**
**మైత్ర్యం కింతు పితామహస్య మమ యత్ శ్రీశేషసింహస్య చ**
**శ్రీహస్త్యద్రిగురూత్తమస్య హి మిథో గాఢం చ వాగ్దూరగమ్. ॥**

శ్రీరామునకు సుగ్రీవునకు మధ్య ఏర్పడిన స్నేహం శ్రీరామాయణంలో ప్రసిద్ధమైనది. ఆ విధంగానే భాగవత పురాణం మొదలైన పురాణాలలో కృష్ణకుచేలుర మధ్య ఏర్పడిన స్నేహం వర్ణించబడింది. కాని, ఇంత కంటే గొప్పదైన చాలా గాఢమైన స్నేహం దాసునకు పితామహులైన శ్రీశేషసింగరాచార్యస్వామివారికి, అణ్ణంగరాచార్యస్వామివారికి మధ్య ఏర్పడింది. ఈ స్నేహం లోని గొప్పదనం వర్ణించడానికి సాధ్యం కానిది.

**19) అకించనేనాఽపి మయాఽత్ర లబ్ధం**
**సమ్మానమేతత్ న విచిత్ర మత్ర ।**
**ఆచార్యసంబంధవశాత్ సమస్తం**
**ప్రాప్నోత్యశక్తోఽపి వినా ప్రయత్నమ్ ॥**

ఈ సత్కారాన్ని పొందడంలో దాసునకు ఏ విధమైన యోగ్యత లేదు. కానీ, దీన్ని నేను పొందడానికి కారణం– దాసుని ఆచార్యులైన శ్రీశింగరాచార్యస్వామివారి సంబంధమే. సదాచార్యసంబంధంవల్ల అందరూ అన్నివిధాలైన శుభాలను పొందగలరు కదా.

**20) కృతజ్ఞతామోదమయీ మయైషా వాగంజలిః ప్రీతిపురస్సరేణ ।**
**సమర్ప్యతే సజ్జనసన్నిధానే శ్రీరాజహంసాఖ్యసుహృద్వరాయ ॥**

నన్ను కాంచీపురానికి పిలిచి, ఈ సత్కారాన్ని అందజేసిన శ్రీరాజహంసంస్వామి వారికి ఆనందంతో కృతజ్ఞతారూపమైన వాగంజలిని పెద్దల సన్నిధానంలో సమర్పిస్తున్నాను.

**21) శ్రీరాజహంసాఖ్యబుధాయ భూయాత్**
**సదా శుభానాం వితతిః వివృద్ధా ।**
**అణ్ణంగరార్యస్య కటాక్షపాతాత్**
**శ్రీదేవరాజామృతవీక్షణైశ్చ ॥**

శ్రీమాన్ రాజహంస స్వామివారికి అణ్ణంగరాచార్య స్వామి వారి కృప వల్ల, వరదరాజ స్వామి అనుగ్రహం వల్ల ఎల్లప్పుడు అన్ని విధాలైన శుభాలు సమృద్ధిగా కలగాలి.

**22) సంపత్కుమారాయ తవానుజాయ**
**తథా జగన్నాథసమాహ్వయాయ ।**
**సమర్పయామీహ నమశ్కృతాని**
**కృతజ్ఞతాభావపురస్సరాణి ॥**

రాజహంసంస్వామీ! దేవరవారికి తమ్ములైన సంపత్కుమారాచార్య స్వామి వారికి, జగన్నాథ స్వామి వారికి కృతజ్ఞతాపూర్వకంగా నమస్కృతులను సమర్పిస్తున్నాను.

**23) రంగప్రియైషా వరదప్రియా చ శ్రీరంగనాథస్య కృపావిశేషాత్।**
**దేవాధిరాజానుగ్రహతశ్చ నిత్యం సమస్తసంపన్నివహం**
**లభేతామ్॥**

చిరంజీవినులైన రంగప్రియ, వరద ప్రియ ఇద్దరు శ్రీరంగనాథుని కృపవల్ల, వరదరాజస్వామి కృపవల్ల ఎల్లప్పుడు సమస్త సంపదలను పొందాలి.

**24) జయతు జయతు దేవో దేవరాజో ధరణ్యాం**
**జయతు జయతు నిత్యం హస్తిగోత్రేశవర్యః ।**
**జయతు జయతు సూక్తిః తస్య పీయూషకల్పా**
**జయతు జయతు మైత్రీ రావయోః ప్రాప్య వృద్ధిమ్ ॥**

కంచి వరదరాజస్వామి ఎల్లప్పుడూ వర్ధిల్లాలి. అణ్ణంగరాచార్యస్వామివారు ఎల్లప్పుడూ వర్ధిల్లాలి. వారి అమృతంవంటి సూక్తి ఎల్లప్పుడూ వర్ధిల్లాలి. దాసునకు రాజహంసం స్వామివారికి మధ్య ఉండే స్నేహం ఎల్లప్పుడూ వర్ధిల్లాలి.

**శ్రీశేషసింహగురుపాదయుగాశ్రయోఽసౌ**
**పౌత్రశ్చ తస్య విలిలేఖ యథామతీత్థమ్ ।**
**అణ్ణంగరార్యవిభవం హృది శింగరార్యః**
**సంభావయన్ సకలసద్గుణరాశిదీప్రమ్ ॥**

శ్రీమాన్ శేషశింగరాచార్యస్వామివారి పౌత్రుడు, వారికి శిష్యుడు అయిన దాసుడు సింగరాచార్యులు ఆణ్ణంగరాచార్యస్వామివారి గుణవైభవాన్ని యథామతిగా ఈ విధంగా నివేదించుకున్నాడు.

****** **శ్రీమదణ్ణంగరార్య వైభవనుతిమాలికా సంపూర్ణా** ******